విడిప్రతి ౧ అణా

# గోలకొండపత్రిక

10271

ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును

సం॥ చందా రూ. ౬ | అక్టోబరు ౨౨ వ తేది ౧౯౩౬ గురువారము | అర్ధ సం॥ చందా రూ ౩

తూపుబజారు, హైదరాబాదు - దక్కన్.

సంపుటము ౧౧ | శా. శ. ౧౮౫౮ = శ్రీధాత సం॥ ఆశ్వయుజ శు॥ ౭ గురువారము. = ౧౭ అబూర్ ౧౩౪౬ ఫ. | సంచిక ౮౫

## వైరాప్రాజక్టులో రైతులగిట్టుబాటు

ప్రపంచంలో, అందులో భారతదేశంలో రైతు అత్యంతప్రాముఖ్యస్థాన మాక్రమించియున్నాడు. దీనిపైననే అందరిసౌఖ్య మాధారపడియున్నది. రైతుదేశానికి వెన్నెముకవంటివాడు. రైతుసౌఖ్యముతోనే దేశ సౌభాగ్యము అభివృద్ధికలుగును శ్రీనిజాంప్రభుత్వంవారు ఇట్టిమహోత్కృష్టోద్దేశ్యముతోనే అత్యంత దరిద్రావస్థలోనుండి దారితెన్నుగానక అలమటించుచున్న రైతుల శ్రేయోభివృద్ధులగోరి అనేక ప్రాజక్టులను జలాధారములనునిర్మించి తద్వారా వ్యవసాయమును సులువుగా చేసికొనుటకు కొన్ని సౌకర్యములు కల్పించినారు. అందు ఖమ్మంలోచేరిన వైరాప్రాజక్టు ఒకటి

ఈప్రాజక్టు నిర్మాణానికై ప్రభుత్వమువారు ముప్పదిరెండులక్షల రూప్యముల పైగా వ్యయము చేసినారు. ప్రస్తుతం ఈప్రాజక్టుక్రింద చేయుసాగుబడి ౧౭,౦౦౦ ఎకరాలకు మించిపోవుచున్నది. ఇచ్చటరైతుల సదుపాయానికై ప్రభుత్వంవారు ప్రశంసార్హమైన ఏర్పాట్లు చేసినారు. నీటిసప్లైకొరకు ఎన్నోకాలువలు త్రవ్వించినారు మరెన్నోతూములు కట్టించినారు నీటినిసక్రమముగా సకాలంలో పెట్టుకొని సాగుబడిచేసుకొనుటకు రైతుకు సర్వవిధసౌకర్యాలు కల్పించినారు. కొనినూతనంగా సేద్యం చేయుటచేత, పొలాలుపంటలకు తిరుగబోవుటచేత, పొలాలు సాగుబడియగుటలేదు. పంటలుపండుటలేదు దేశమంతటను ఆవరించిన ఆర్థిక మాంద్యమిచ్చటకూడా ఎక్కువగా ఉండుటచేత ధరలుపడిపోయినవి. పెట్టినపెట్టుబడివచ్చేటట్లులేదు. కాని రైతుమాత్రం అంతులేని అప్పుచేసి, అలవికానిశిస్తుకట్టి కుటుంబపోషణము చేసుకొనలేక గంపెడుదిగులుతో, జీవచ్ఛవమై పోవుచున్నాడు, మరికొందరు రైతులు ఇల్లువాకిలి గొడ్డూ గోదా. అంతావదలి అన్నమోరామచంద్రాయని దేశాలపాలై పోవుచున్నారు. ఇట్టిదుస్థితి ప్రభుత్వంవారికి తెలియకపోవుటచేత తన్నివారణోపాయ మాలోచింపకున్నారు. కనుక రైతులనిజస్థితి తెలుపుటకుగాను వారివ్యవసాయములోని సగటు ఆదాయవ్యయ నిష్పత్తిక నివేదిక నిందుపొందుపరచుచున్నాను. ఇందు ఐదుగురు కుటుంబమువగల రైతు స్థితిని వివరింతును.

ఈమాగాని వ్యవసాయంలో మూడువిధాలు అమలులోవున్నవి.

మొత్తంకూలి లెక్కకట్టు విధానము

౨. సంసారపక్ష విధానము

౩. కౌలు విధానము.

వీనిని జమాఖర్చులెక్కల వివరాన్ని ఇచ్చట తెలియజేయుదును.

### మొత్తంకూలి లెక్కకట్టు విధానము

| | |
|---|---|
| నారుమడికి ఎరువుబండి | 1-0-0 |
| కోలకం కూలి | 0-8-0 |
| నారుమడి విత్తనాలు (5 మానికలు) | 0-8-0 |
| చేనుదున్నుటకు మనిషికూలి | 0-4-0 |
| నాగలి, జతఎద్దులకు | 1-0-0 |
| ఎరువు | 10-0-0 |
| మాగ్పడి | 3-0-0 |
| జనప విత్తనాలు | 1-0-0 |
| గడ్డికి పై వగైరా తోలటానికి | 2-0-0 |
| పంటకోల్వాల మరమ్మతు | 0-8-0 |
| శిస్తులు ఎకరానికి రు 13-0-0 మొదలు రు 18-0-0 వరకు వున్నది కనుక సగటున ఎకరానికి | 15-0-0 |
| మొత్తం రు. | 34-12-0 |

### ఒక ఎకరానికి వ్యయము ధాన్యరూపమున

| | మనుష్యులు | శేర్లుజొన్నలు |
|---|---|---|
| దుబ్బుచెక్కడానికి | 2 | 6 |
| ఎరువుపోగులు చల్లడానికి | 2 | 6 |
| చేను బాగుచేయడానికి | 2 | 6 |
| నాటుతీత | 1 | 3 |
| నాటుటకు | 5 | 15 |
| కలుపు | 5 | 15 |
| కోత | 7 | 21 |
| పొంపులుకట్టుట, కుప్పవేయుట వగైరా. | 7 | 21 |
| జనపకోత | 4 | 12 |
| కట్టలుకట్టుట | 2 | 6 |
| వామివేయు | 2 | 6 |

మొత్తం 117 శేర్లు జొన్నలు లేక రేట్లు మానికెలు రు. 8-4-0 (ఖరీదు)

ఇచ్చట కూలీలకు జొన్నలేఇచ్చుట వాడుకయైనందున జొన్నలలో లెక్కకట్టి మొత్తం ఖర్చులో చేర్చనైనది.

మొత్తం ఎకరానికి వ్యయం

34-12-0 + 8-4-0. రు 43-0-0.

పది ఎకరాలకు రు 43 × 10 రు 430-0-0.

### ఐదుగురు కుటుంబానికి సగటు వ్యయము

| | |
|---|---|
| పాడిబట్టె | 30-0-0 |
| ఒక జీతగాడు భోజనం, గుడ్డలు, చెప్పులు, పొగాకు వగైరా ఖర్చులతో సహా | 100-0-0 |
| పప్పుదినుసులు వగైరా | 10-0-0 |
| పండుగలు వేడుకలు | 30-0-0 |
| వంటకట్టెలు | 3-0-0 |
| భోజనం బట్టలువగైరా | 200-0-0 |
| మొత్తం రు. | 373-0-0 |
| | 21-0-0 |
| మొత్తం రు. | 394-0-0 |

### ఆదాయము

| | |
|---|---|
| ఎకరము గడ్డి విలువ | 6-0-0 |
| ఎకరము కట్టె విలువ | 4-0-0 |
| ఎకరములోనిపంట సగటున 8 బా॥ ఐన ఖరీదు | 40-0-0 |
| మొత్తం రు. | 50-0-0 |

పది ఎకరాలకు 50 × 10, రు 500-0-0.

### ధాన్యరూపమున

| | | | |
|---|---|---|---|
| చాకలికి | 50 | మానికలు | జొన్నలు |
| కుమ్మరికి | 10 | ,, | ,, |
| మంగలికి | 20 | ,, | ,, |
| బత్తుల | 50 | ,, | ,, |
| మాదిగ | 20 | ,, | ,, |

మొత్తం 150 మా॥లకు 50 మా॥లు ఒక బస్తా కొ॥ 3 బస్తాలు బస్తా 1 కి 7-0-0 చొ॥ 3 × 7 21-0-0.

మొత్తం నికర వ్యయము

రు 430-0-0 + 394-0-0 రు 824-0-0

| | |
|---|---|
| నికరవ్యయము | రు. 824-0-0 |
| నికర ఆదాయము | 500-0-0 |
| నికర నష్టము | రు. 324-0-0 |

### 2 సంసారపక్ష విధానం

వ్యయము:-

| | | | | |
|---|---|---|---|---|
| చేను బాగుచేయుటకు | 2 | మనుష్యులు | 6 | శేర్లుజొన్నలు. |
| నాటుతీత | 1 | ,, | 3 | ,, |

( ౧౧ వ పేజీ చూడుడు)

# తెలంగాణా వార్తలు

## గణపతిఉత్సవము ఇంకను ఆగియున్నది

ఓరుగంటివార్తలు

[స్వకీయవిలేఖరి]

### గ్రంథాలయముల స్థితిగతులు

హనుమకొండలోని గ్రంథాలయభవనమున కు ప్రాకారము కట్టవలసియున్నది ఇంతవఱ కొప్రయత్నమేలేదు మట్టివాడ గ్రంథాలయమునకు ౩౫౦౦ వఱకు పుస్తకములున్నను స్థిరమైన సొంతగృహము లేదు. ఇపుడున్న గృహము సొంతమేగాని ప్రాతదగుటచే గ్రంథాలయము నకుఉపయోగపడని స్థితిలోనున్నది. ఏసిలో హనుమకొండ గ్రంథాలయమునకు గ్రంథసంఖ్య తక్కువ. ఉన్నవానిలో శిథిలప్రాయములు విశేషము. మట్టివాడ గ్రంథాలయమునకు నూతన గృహము అవసరము. ఈలోపమే నాటికితీరునో?

### విద్యుద్దీపములు

సుబా ప్రధానస్థలమగు ఓరుగల్లు హనుమకొండలలో విద్యుద్దీపనిర్మాణముచురుకుగా జరుగుచున్నది. బిజంజాహీ విల్లునుండియు ఇంకను మూడునాలుగు మైళ్లనుండియు ఎన్నుకొన్న సమకూర్చి నగరమునందుగల ముఖ్యవీధులన్నిటిలో దీపములు సమకూర్చబడినవి ఒక్కొకరోడ్డుల లోగూడ విద్యుద్దీపములు నెలకొల్ప ప్రయత్నములు జరుగుచున్నవి దీపములుంచుకొన్న వారు గు ౩-౮-౦లకు తక్కువగాని మొత్తముసెల కీయవలెను వాడుకొన్నదానికిట్టి యింకను హెచ్చుఖండును ప్రభువుగారి జన్మదినోత్సవమున మిగులవిచిత్రముగా మైదానమునందు విద్యుద్దీపము లమర్చబడెను ఈనెల ౧౫ తేది నుండి రాత్రి ౧-౨ గంటలును విద్యుత్తుగృహము కొనసాగుచున్నారు స్వల్పకాలములో విద్యుద్దీపములింకను వృద్ధికాగలవు

### గణపతిఉత్సవములు

మట్టివాడలో రెండుతావులను హనుమకొండలో రెండుతావులందును నెలకొల్పబడిన గణపతి విగ్రహముల విసర్జనోత్సవములు జయప్రదముగా జరిగినవి హనుమకొండలోని బ్రాహ్మణవాడలోగల గణపతిని విసర్జనముచేయుట కు దొరతనమువారు తాత్కాలికముగ త్రొక్కోవ సూచించిరి. వెనుకట్టిత్రోవను బోవుటకు అజ్ఞదొరకుటయో దొరకకపోవుటయో నిర్ణయమగువఱకు ఉత్సవము స్థానికులాపివేసిరి ఈగణపతి మండలిలో సనాతనధర్మములనుగూర్చి శ్రీమాన్ అమరవాది నారాయణాచార్యుల వారు కర్మయోగమునుగూర్చి శ్రీమాన్ కోవెల రంగాచార్యులవారు మనోహరముగ ప్రవచనము గావించిరి

### నీటిపంపులు వానిఅవసరము

హనుమకొండకు ఎనిమిదిమైళ్లదూరములో నున్న ధర్మసాగరమునుండి నీరు తెచ్చి హనుమకొండ నీటినిలువచేసి పంపులద్వారా మట్టివాడ హనుమకొండలకు జలము సప్లయిచేయుటకు నిర్ణయముజరిగి చాలకాలమయ్యెను అజాయి నుండిపనిఆరంభించుటకై ఉద్యోగవర్గము వచ్చియున్నది ఒకసంవత్సరమునకు హనుమకొండలోనికి తరువాత సంవత్సరములోగా వరంగంటికి పంపులురాగలవని వినుచున్నారము డ్రేనేజిపనిగూడ ఆరంభము కాగలదనియు తెలియుచున్నది ఇప్పటికి టెలీఫోను విద్యుద్దీపములు సమకూరినవి జలశాఖము తేలినచో నగరవాసులకెంతేని సౌకర్యము కలుగగలదు నగరవాసులకు ఒకటిరెండు సంవత్సరములలో జలశాఖము లభింపగలదని విశ్వసించుచున్నారము కలరాబాధ చాలవఱకు తగ్గినది

### స్థానికగ్రంథాలయములు

వరంగల్లులోని శబ్దానుశాసన గ్రంథాలయమున గ్రంథములు ౩౮౦౦ వఱకుగలవు అందు విలువగల గ్రంథములు విశేషించగలవు మూలధనము రు ౧౨౦౦౦ల వఱకుగలదు. పత్రికలు ౧౨ వచ్చుచున్నవి దొరతనమువారు నెలకు రు ౧౫లు ఒసంగుచున్నారు సభ్యుల చందావలన నెలకు రు ౬౦లు వఱకు ఆదాయముగలుగును ప్రస్తుతమున్న గ్రంథాలయపు సొంతభవనము చాలశిథిలావస్థలోనున్నది పలుబోయి లకుదియుచున్నది త్వరిలోనూతన గృహప్రయత్నము చేయుట అత్యవసరమని తోచుచున్నది హనుమకొండలోని రాజరాజ నరేంద్రగ్రంథాలయము మనోహరముగా నున్నది దాదాపుగా ౨౦౦౦ పుస్తకములుగలవు. గ్రంథములు శిథిలావస్థలోనున్నవి ఈసంవత్సరము గడచిన గ్రంథములింకను నిలయమున జేర్పలేదు మూలధనము నాటకములవలనను, ఓత్సవముల మూలమునను అంతకు ముందున్నదియుగలదు దాదాపు రు౧౦౦ వఱకుగలవు దొరతనమువారు నెలకు రు ౧౦ లువంతున గ్రంథాలయమునకు వేతనమొసంగుచున్నారు వరంగల్లు గ్రంథాలయమునకు భవనము హనుమకొండ గ్రంథాలయమునకు గ్రంథాలయమునకు గ్రంథములు చాల యవసరము కార్యనిర్వాహకు లీవిషయమునదగు శ్రద్ధగొనుట అత్యవసరము

—

## చుక్క తెగినది

—

నందివనపర్తి [జాగీరు] ౧౯ అక్టోబరు తెల్లవారుజామునకు ఈశాన్యదిక్కునుండి వాయవ్యమూలకు పెద్దదియగు దేదీప్యమానమగు పెద్దనక్షత్రము సుమారు ౭ గంటల రాత్రివేళ పడినది గ్రామమంతయు పట్టపగలువలె ప్రకాశించినది అదేసమయము ఈశాన్యదిక్కున ఒక చిన్ననక్షత్రము వలయాకారముగ తిరుగుచు వలయము యేర్పడినది నక్షత్రముపడిన నిమిషమువరకు అవలయముల్లెయుండి మాయమైనది. నక్షత్రము పడిననిమిషమునకు పెద్దధ్వని వినిపించినది నక్షత్రముయొక్క కాంతిచే కండ్లు కనపడక పచ్చనయినవి ధ్వని అందరను అదరింపజేసినది ఈవింతనుగురించి ప్రజలు గుంపులుగుంపులుగా చేరి, ఇదిఏమివింతయని అడుగువారు, పంచాంగములుచూచువారు, ప్రపంచకమునకు అరిష్టమనువారు, బాంబుప్రేలినదనువారు, యెచ్చటనో భూకంపము కలిగినందున ఈశబ్దము వినబడినదనువారు, నక్షత్రముపడుట ప్రపంచమున గొప్పవారి మరణమునకుచిహ్నమనువారు, ముందు ఎప్పుడో భూకంపమువచ్చునది సూచన చేయుచున్నదనువారు. అనేకవిధముల అనుకొనుచున్నారు ఇటువంటివి ఇదివరలో ఎప్పుడు జరిగియుండలేదట దీనికారణమేదో దయచేసి యేమహాశయులయినను తెలిపి మాసంశయమును మాన్ప ప్రార్థితుడను.

ఇట్లు విధేయుడు

ఒక గ్రామవాసి

—

# విఘ్నేశ్వరుని వూరేగింపు కెన్నో విఘ్నాలు

—

హనుమకొండయందు అనేక సంవత్సరాల క్రిందటనే, అందరూకలసి, గణపతినిస్థాపించి వుత్సవం జరిపేవారుకపడ్డవి. విద్యార్థులే ఎంతో వుత్సాహముతో నడుముగట్టుకొని వేడుకను నడుపుచ్చేవాండ్లు. అధికార్లుకూడా ఎట్టిఆటంకాలులేకుండా ఆజ్ఞయిచ్చేవాండ్లు.

గణపతి నుట్టక్రిందనున్న గజానన మండలి నుండి బయలుదేరి, హాయిగా హైగోర్టుమీదు గా (దర్గాషరీఫుముందుగా) హాస్పిటాలుప్రక్క నుండి హైందవజన మెక్కువున్న అన్ని బాజార్ల సుండా, అనాదీయమైన ఖానుసముద్రానికి అర్ధరాత్రికి జేకొని, అనుచరులందరి సహా శ్చన్యంలో ఒడవేసి, అంతర్ధానమయ్యేవాడు. ఏ అలజడిలేకుండా అన్నీ యథావిధిగా జరిగె విఎవరూ ఎదిరించేవారుకారు. అట్లాజరిగి పది హన్నెండు సంవత్సరాలు. అదిమా దేవరు భారతదేశంపై అనేకమైన భూతాలయొక్క కండ్లు భగ్గుమనవి. ఎచ్చటాలేని మైత్రి ఇక్కడేందుకని ఏగిరిపడ్డది! మాఖిస్తాతడాభాఅని. తూగింది ముందుకు! ఉత్సవం పోయ్యేమార్గంలోవున్న ఒకమ్మితుణ్ణి వూపెమాచింది ముందటిసంవత్సరం.

అంతటితో ఆయనకొచ్చింది ఆమితసిగం. నాయింటిముందటినుంచి ఉత్సవంపోవటం నేనొప్పుకన్నాడు. గోలజరుగుతుందని గుద్ది చెప్పాడు. అందువల్ల అంతాఅయోమయమే. కాని తెలివితేటలుగల తాలూక్దారుగారు వుండబట్టి తగాదాలకెట్టి తావులేకపోయింది. ప్రాగినాయన్ని మొదటనే వొత్తిపట్టాడు. అంతటితో అంతాహాయిగానే జరిగింది.

నిరుడుకూడా యిట్టియిబ్బందులే కలిగేవరకు దయగల తాలూకుదారుగారే తగినశ్రద్ధ చూపినారు. తామే ముందునిలబడి తీయించారుఉత్సవాన్ని.

ఈసంవత్సరం యథాప్రకారంగానే హిందువులు. అర్జిపెట్టుకున్నారు అజ్ఞకై. తహసీలుదారుగారు మొదటకొంచెం సంకోచించినా తెలివితేటలుగలిగి, న్యాయాన్యాయ విచక్షణ గలవారుకాబట్టి, ఆజ్ఞయివ్వటానికెట్టి అభ్యంతరంలేదన్నారు. తహసీలునుంచిమిసలు తాలూక్దారుగారికి బంపినారు. మీకేమైనా వుజరాత్లు [అభ్యంతరాలు] వుంటాయాఅని అడిగారువారు, మహమ్మదీయులను దర్గా, మసీదుముందుగా ఉత్సవంపోవటంమనకు చిన్నతనమనుకున్నారు. ఆజ్ఞయివ్వటం అక్రమం, అనుచితం, అవి అటువైపునుండికూడా అర్జుబడ్డది. కొరజాలెన్నో కల్పించారు. దర్గాముందునుంచి వుత్సవం పోవటమేలేదని దండోరాగా చెప్పారు.

అప్పటి కతికిందిరంగు కొర్వాయికిఅందంగా! గవాహీల బయాన్లవల్లివిషయం అధికార్లకుచక్కగా గ్రాహ్యమయినా, గపుచుపుగా వున్నారు. తాలుక్దారుగార్కి తోచిందేమోకాదు. అంతట్లోకి ఉత్సవపురోగాలు అందుకున్నవి అందరికీ అమితమైన అదుర్దా!

సంగతంతా అంతటితో సూబేదారుగారి ముందటబడ్డది, సర్వం తెలిసినవారుకాబట్టి సాహసించారు. ఆజ్ఞవొకకింది. గరా తారీఖున వ్యువలసిఁది ఉత్సవాన్ని. ఆనాడు తీయటానికి కొన్ని అవాంతరాలొచ్చేవరకు [అకై] కు తీస్తామని తామే చెప్పుకున్నారు. తెలివగల మననాయకులు! అందులో, అందుకున్నారు కొందరు అపార్టీనుంచి, హైద్రాబాదునుయిత్తెహాయిహుకుం తెచ్చి ఎగిరికొట్టారు మొఖాన.

ఫిసాదుకే అవకాశముంటే మార్గంమార్చండని ప్రభుత్వంవారన్నారు. పాపం వారికేమిలోపం? అంతటితో మనవాండ్లపని అయిపోయింకొదాను! అంతవరకు రావటంకూడా ఏనాటి పుణ్యఫలమో! అయినాసాహసించి, మార్గం మార్చటం మాచేతగాదన్నారు. అంతేచాలు! ఉత్సవపుదినాలు దాటికూడా ఒకమాసముయింది.

గణపతక్కడనే గుబ్బుబెడుతున్నాడు. కొర్వాయి హైద్రాబాదులో కునికిపాట్లు బడుతున్నది! ఎదటిపార్టీవాండ్లు ఎగురుతున్నారు. శోకపార్టీవాండ్లు వొగస్తున్నారు?

అలజడి ఆగిపోయినందుకు, ఆఫీసర్లకొంచెం హాయిగావున్నారు!! పైగా తిరగటంవల్ల ప్రైవేవాండ్లకు కొంతప్రాఫిట్ యిట్లావున్నవి, యివాళరేపు అక్కడిపరిస్థితులు.

ఇట్లు
కె.వి. రామారావు

—

## కామినియా సాండల్ సోప్ రిజిష్టర్డు

హిందూ దేశమునకు ఆదర్శప్రాయమైన సబ్బు. మిక్కిలి కోమలమైన చర్మమును ఉష్ణదేశముయొక్క వాతావరణమునుండి రక్షించుటయేగాక చర్మమును సంపూర్ణముగ శుభ్రపరచి ఉల్లాసకరమైనట్టియు, కోమలమైనట్టియు గంధపుచెక్కయొక్క సువాసన మిగుల్చును. వెల 3 బిళ్లలుగల పెట్టె 1కి అణాలు 14. ఖర్చులు వేరు.

## అడ్రెనాలిన్ సైపన్ సాల్వ్ (రిజిష్టర్డు

జలుబును, మేహవాతనొప్పులను

### తప్పక కుదుర్చు ఔషధము

జలుబును ఎప్పుడును నిర్లక్ష్యముచేయకుడు. సువాసనగల ఈసాల్వును మెడకు, రొమ్మునకు, భుజములకును మర్దించినయెడల తప్పక ఉపశమనము కలుగును ఆరంభదశలో ముక్కుమీదకొంతపూసి పరిశుభ్రపరుచు దీనివాసనను చూడవలెను. మేహవాతనొప్పు నివారించుటకై నొప్పులున్నచోట మర్దించినయెడల సైపన్ సాల్వ్ చిన్నచిన్న రంధ్రములద్వారలోపల ప్రవేశించినంటనే నొప్పిని, పట్టును తగ్గించును.

ఎల్లచోట్లలో దొరుకును—వెల బుడ్డి 1కి రు. 1-0-0. వి.పి. ఖర్చులు వేరు. 3 బుడ్లకు రు. 2-8-0

2 అణాలు పోస్టుబిళ్లలు పంపినచో శాంపిలు ఉచితముగా పంపబడును.

సోల్ ఏజెంట్లు:—దిఆంగ్లో యిండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెని, బొంబాయి 2.

---

## ధసరా

మీకు మీకుటుంబమునకు క్రొత్తవస్త్రములు కొనవలయును. అది అంతా డబ్బుతో పనిగనుక, ఎంతఆగునో అని మీకు చిరాకుగాయుండును

"విచారించవద్దు"

"తానులలో మిగిలినముక్కలు" మీకు చౌకగాదొరకును మావద్ద సిల్కులోను నూలులోను వివిధోపయోగములకొరకు చాలాకముక్కలు మావద్దనుండి కొని ఖర్చు తగ్గించుకొనుడు

### ది దక్కన్ కట్ పీస్ క్లాత్ స్టోర్

మురలీధర్ బాగుఎదుట, నిజాంషాహీరోడ్డు హైదరాబాదు (దక్కన్)

---

## యం. ఇస్మాయిల్ సేట్ & బ్రదరుస

టెలిఫోన్ నెం. 800 వారి

### గొప్ప వేలము

రాజా రాధాకిషన్ గోపికిషన్ వద్ద కొంతమందిరాజులు నవాబులచే తాకట్టు పెట్టబడిన అందమై విలువగలిగిన ఆభరణములు, గొలుసులు, ఉంగరములు, పమిటెపిన్నులు, చెవులపోగులు, గుండీలు, తలలోనిపిన్నులు వగైరాలున్ను, కొలిజగినవలు వజ్రములతోను పచ్చలతోను, నీలములతోను మరియు ముత్యములతోను అమర్చబడియున్నవి వేలము వేయబడును.

మంచి ఫ్యాషన్ గల
విలువయైన
నగలు
కొనుటకు యిది
మంచిసమయము.
ధరలుసరసము.

1936వ సంవత్సరములో
23వ, గొప్ప అమ్మకము
23వ అక్టోబరు శుక్రవారము
18వ ఆజూరు 1346 ఫ.
సాయంత్రము 5 గంటలకు
"దక్కన్ హాలు"
రివోలిటాకీల ఎదుట
సికింద్రాబాదు,

వస్తువులు పరీక్షించుటకు ప్రతిదినము ఉదయం 8 గంటలు మొదలు సాయంత్రము 6 గంటలవరకు వీలగును.

### జనానాకు ప్రత్యేకసౌకర్యములు.

21, & 22 తారీఖులయందు సాయంత్రము 6 గంటలనుండి 8 గంటలవరకు.

పత్రా:—అమ్మకపు రివాజులు, ధరలు, యింకా యితరవిషయములకు వాటికొరకు ప్రత్యేకింపబడిన కేటలాగులు చూడుడు.

---

అసమాన సౌందర్యము, నునుగడగల్గిన గడియారములు ధరిపించిన విలువ

పైనయున్న "స్క్వేర్ బి" గాని క్రిందయున్న "స్క్వేర్ యఫ్" గాని ఒకేధర.

| | |
|---|---|
| చాందిజండి | రు 32 |
| 9 క్యారట్ బంగారము | ,, 60 |
| 14 క్యారట్ ,, | ,, 75 |
| 18 ,, ,, | ,, 90 |

మా పెద్ద ఉచిత కేటలాగుకొరకు వ్రాయుడు

(మగ) "స్క్వేర్ డి"

| | |
|---|---|
| 9 క్యారట్ బంగారం | రు 65 |
| 4 ,, ,, | ,, 82 |
| 18 ,, | ,, 011 |

వెస్టుయెండ్ వాచ్ అండు కో, బొంబాయ అండ్ కలకత్తా

WEST END WATCH Co
BOMBAY CALCUTTA

---

## ఆర్. గోపాల్

జనరల్ క్లాత్ మర్చెంటు

అమెరికన్, గుండిపర్, అమృతసర్. ఫ్రాకులు వగైరా తయారుగా దొరకును.

చిన్నబిడ్డలకు నెలరోజుల మొదలు నాల్గు సం॥ల వరకు అమెరికన్ శిల్కు, ఫ్రాకులు అనేక రంగులు చిక్కును.

స్త్రీల జంపర్లు సల్కువి దొరకగలవు.

రిజిష్టరు నెం. ౩౨౨   యిందర్ మల్ బిల్డింగు

షాహెరాహ ఉస్మాని, కోరిబన్నుస్థాండు హైదరాబాదు.

నోటు:—ఆర్డరుపైన ౨౪ గంటలలో తయారుచేసి యివ్వగలము.

---

## 'T' మార్కు కస్తూరి

(రిజిష్టర్డు)

నిజాం లేబరేటరిలో పరీక్షింపబడి, సర్టిఫికెట్లుపొందిన మాయొక్క సుప్రసిద్ధమైన "T" మార్కు కస్తూరినే ఎల్లప్పుడు వాడి, మీశరీరము ఆరోగ్యముగా ఉంచుకొనుడు. మాకస్తూరి హైదరాబాదునందలి మరియు హిందూస్థానమునందలి వైద్యులచే మిక్కిలి పొగడబడియున్నది,

మాయొక్క "T" మార్కు కస్తూరి మంచిదికాదని రుజువుచేయువారికి రు ౫౦౦ బహుమానము యివ్వబడును.

ఒక్కొక్క సీసావెల రు 0—10—0

అన్నిచోట్ల దొరకును

## సూచన

దసరా సెలవు వచ్చుటచే రాబోవు సోమవారము పత్రిక వెలువడదు.

గో. ప. సం.


# గోలకొండ పత్రిక

ధాతనామ సం॥ ఆశ్వయుజ శు॥ ౭

గురువారము


## హైదరాబాదు ఉపాధ్యాయ సంఘము

గతశుక్ర శనివారములందు జరిగిన హైదరాబాదు ఉపాధ్యాయ సంఘము యొక్క పదవ సమావేశమునందు ఆకర్షించు అంశములు కొన్ని గలవు.

అన్నిటికంటె ముఖ్యమైనది, మన విద్యాశాఖమంత్రియగు నవాబ్ మెహిదియార్జంగుగారు ఈసమావేశములో ప్రభుత్వము ముందుకు అవలంబించబోవుచున్న విద్యావిధానమును దిఙ్మాత్రముగ సూచించినారు. ఇకమీద ప్రభుత్వమువారు ఉన్నతవిద్యవిషయములోకంటె ప్రాథమికవిద్య విషయమున ఎక్కువ శ్రద్ధవహించనున్నారనియు, ప్రాథమిక విద్యతర్వాత సాంకేతిక విద్యకు విద్యావిధానమందు ప్రాముఖ్యత యొసగబడుననియు నవాబుగారు ప్రకటించినారు. ప్రాథమిక విద్యావ్యాప్తికి ఏవిధముగ ప్రోత్సాహ మొసంగెదరో, సాంకేతికవిద్యకు ఏర్పాట్లు నేవిధముగ జేసెదరో వివరములు తెలియనంతవరకు ప్రభుత్వవిధానమునుగూర్చి సంపూర్ణవిమర్శ చేయజాలము. కాని ఇప్పటికైనను ప్రభుత్వమువారికి ప్రాథమికవిద్యావ్యాప్తి ప్రథమావసరమని నిశ్చితమైనందుకు సంతోషించవలసియున్నది. నిర్బంధప్రారంభవిద్యావిధానమునకు ప్రభుత్వమువారు ప్రస్తుత పరిస్థితులలో అనుకూలించరని చెప్పినను, దానివిషయమై ప్రతినిధులగు నాయకులతో కలిసి సాధకబాధకములను చర్చించుటకు ప్రభుత్వమువారు సుముఖులేయనుమాట సంతోషకరమైనదే. ఈ అవకాశమును గమనించి, రాష్ట్రమందంతటను విద్యావిషయములో కృషిచేయుచున్న వారందరును నిర్బంధప్రారంభ విద్యను ప్రవేశపెట్టువిషయమై ప్రజాభిప్రాయములను తెల్పి ప్రకటించు యత్నములు చేయుట మంచిది.

సమావేశములో గమనించదగిన రెండవ ముఖ్యవిషయము అధ్యక్షులగు ఉస్మానియా విద్యాపీఠపు ప్రోవైస్ ఛాన్సలరుగారి ఉత్సాహపూరితమగు ఉపన్యాసము. ఈఉపన్యాసమునంతయు విమర్శించుటకు ఈ వ్యాసమందు అవకాశములేదు, కాని వారు బాలుర శిక్షణ శైశవమునుండియు ఏవిధముగ జరుగవలసినది చెప్పుచు భయమనునది శిశువుయొక్క జీవితమును కళంకితముచేయకుండ కాపాడవలెనని చెప్పినమాట మాత్రము చాల ముఖ్యమైనదని చెప్పగోరుచున్నాము. "భయమనుదానిమూలముననే సకల దుర్గుణములును ఉద్భయించుచున్నవి." అని వారుచెప్పిన వాక్యమును, దాని అర్థవివరణమును ఈ సంవత్సరపు అధ్యక్షోపన్యాసమునకు పూర్వసంవత్సరముల అధ్యక్షోపన్యాసములంకంటె విశేషత్వమును ఇచ్చుచున్నది.

ఈ హైదరాబాదు ఉపాధ్యాయసంఘమనునది ౧౩౩౮వ ఫసలీలో (౧)వివిధ పాఠశాలల ఉపాధ్యాయులమధ్య సహకారమును ఏర్పరచుట, (౨) వారలకు విద్యాబోధనపద్ధతులగూర్చిన క్రొత్త క్రొత్త అభిప్రాయములను పరిచయముచేయుట, (౩) సహకారపద్ధతిన వారికందరికి సమానముగనుండు కష్టములను పరిష్కరించుకొనుటకు తోడ్పడుట—అను మూడు ఉద్దేశ్యములతో స్థాపించబడినది. ఇంతకాలముగా ఈసంఘము చేసిన పనులనేకములు అహ్వాన సంఘాధ్యక్షునిచే పేర్కొనబడినవి. కాని మా దృష్టికి, ఇవన్నియు అటుంచి, ఇంతకాలముగాడుపేక్ష చేయబడుచున్నట్లు కనిపించుచున్న ఒకవిషయము ఆశ్చర్యముకలిగించుచున్నది. ఇంగ్లీషుబోధన విషయములోను ఉర్దుబోధన విషయములోను శ్రద్ధవహించుచున్న ఈసంఘమువారు ఈరాష్ట్రమున ముఖ్యమైన తక్కినముక్కి భాషల బోధనవిషయమై ఏల శ్రద్ధవహించుటలేదు? ఈసంఘమునందు తక్కినభాషల బోధించు ఉపాధ్యాయులు సభ్యులుగలేరా? లేక ముక్కి భాషల బోధనము అంత ముఖ్యముకాని విషయమనియా? ఒకసారికాబోలు తెలుగువిషయమై అవసరమగు ఏదోవిచారణ నొకదానిని చేయుటకు ఒక ఉపసంఘమును స్థాపించవలసినదనుసూచన రాగా, ఆసూచన త్రోసివేయబడెనని వినియున్నాము. విద్యాబోధనపద్ధతుల విషయమై ఒకసంఘపు సహాయముతో నూతనాంశములను కనుగొన యత్నించుట మున్నగు కృషిచేయుట, మన దేశమందు ఇంగ్లీషు భాషలోకంటె దేశభాషలలోనే ఎక్కువ అవసరము. ఈసూచన హైదరాబాదు ఉపాధ్యాయ సంఘమువారి దృష్టినాకర్షించు గాక యని ఆశించుచున్నాము

—

## శ్రీయుత కొండా వెంకట రంగారెడ్డిగారికి సన్మానము

గత గురువారము రాత్రి గోలకొండ పత్రికా కార్యాలయోద్యోగుల పక్షమున శ్రీయుత కొండా వెంకటరంగారెడ్డిగారు శాసనసభయందు సభ్యులైనందుకు సంతోషము తెలుపుటకై విందు చేయబడెను. శ్రీయుత అక్కినేపల్లి జానకిరామారావుగారు, శ్రీయుత మా. హనుమంతరావుగారు, శ్రీయుత మందుముల రామచంద్రరావుగారు మున్నగువారలు వచ్చియుండిరి భోజనానంతరము శ్రీయుత సురవరం ప్రతాపరెడ్డిగారును, మా. హనుమంతరావుగారును రంగారెడ్డిగారి నభినందించిరి రంగ రెడ్డిగారు కృతజ్ఞతచెల్పిరి.

—

# హైద్రాబాదు ఉపాధ్యాయుల మహాసభ

—

కార్యక్రమము

—

"మా ప్రత్యేక విలేఖరి"

—

హైదరాబాదు (దక్కను)౨౦-౧౦-౧౯౩౬

—

### మొదటిరోజు

గతశుక్రవారం ఉదయం ౯-౧౫ నిముషములకు హైద్రాబాదు ఉపాధ్యాయుల మహాసభ సమావేశమయ్యెను. మొదట ఖువారిజ్మీ షజాఅలీగారు ఖురానునుండి ప్రార్థన గీతముల వినిపించిరి. తరువాత జి. పాఠకుగారు భగవద్గీతలోనుండి ప్రార్థనాగీతముల వినిపించిరి.

వెంటనే నూరుల్ హసన్ గారు తమఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసము చాలవిపులముగా జదివిరి. ప్రేక్షకులు, అతిథులు అప్పుడప్పుడే వచ్చుచుండిరి. శబ్దాతిశయీకరణ యంత్రములు అమర్చబడి యుండెను. మహాసభాధ్యక్షులగు కాజిమహామద్ హుస్సేన్ గారు అధ్యక్షపీఠమునుండి రెండు విషాదతీర్మానములను చదివిరి; మొదటిది డాక్టర్ వెంకటజీగారి అకాలమృత్యువునకు, తర్వాత మర్ మహ్మూద్ పిక్తాలుగారి అకాలమరణమునకు చింతను వెలిబుచ్చుచు వారి ఆత్మశాంతికిగాను భగవంతుని ప్రార్థించిరి.

తదుపరి కార్యదర్శిగారు గతసంవత్సరనివేదికను జదివిరి. వెంటనే అధ్యక్షులుతమఎనిమిదిపేజీల ఉపన్యాసమును ఇంగ్లీషుభాషయందుజదివిరి. ఉపన్యాసము చాలమంచిశైలి (Style) లో వ్రాయబడియుండెను; కమిటీరిపోర్టును, హార్టాగు కమిటీరిపోర్టును పురాతనపు కలకత్తా యూనివర్సిటీ కమీషన్ రిపోర్టును ఇంతకుముందేచదివినవారికివీరిఉపన్యాసములో క్రొత్తవిషయములు లేకుండెను.

వీరిఉపన్యాసముకాగానే చాలమంది ప్రేక్షకుల వెళ్లిపోవ మొదలిడిరి,అందుచే సభలో చాల శబ్దము మొదలయ్యెను. కాని డాక్టర్ యూసుఫుహుస్సేన్ ఖాన్ గారు తమ ఉపన్యాసమును ప్రారంభించిరి. "హైందవపాఠశాలలలో దేశచరిత్రను (History) ఎట్లు పఠించవలయును" అను విషయముమీద ఉపన్యసించిరి. వీరిదృష్టిలో ఔరంగజేబుచాల ఆదర్శపు చక్రవర్తి. అతడు కేవలము రాజ్యకాంక్షచేగాక, హిందూదేశమునకు ఉపకారముచేయుటకై తమతమ్ముల జంపియు, ముసలితండ్రిని చెఱసాలయందుపెట్టియు రాజ్యమునకువచ్చెనట. ఇంతియెగాక వీరు ఇంకఎన్నియోచిత్రభావముల ప్రకటించిరి. తాము ఈభావముల ప్రకటించుచు ఒకహిందూ దేశచరిత్రవ్రాసిన హైద్రాబాదు రాష్ట్రమునకైన పఠనయోగ్యమగునేమో!

తదనంతరము "హిందూదేశమందు స్త్రీ విద్య" అను విషయముపై మిస్. అంగ్లర్ గారు ఉపన్యసించిరి. వీరుమొదలే ముసలివారు. దీనికి జతగా వీరు శబ్దాతిశయీకరణయంత్రమువద్దకు వచ్చి మాట్లాడలేదు. అందుచేవీరు ఏమిజెప్పిరో గాని ముందుగూర్చున్న మాకే తుదముట్ట తెలియలేదు. వీరితరువాత కెప్టెన్ పతావల్ గారు "విప్లవము" అను విషయముమీద ఉపన్యసించిరి. వీరికి గొప్పభావములుండినట్లే తోచుచున్నది,వీరు రెండుభావముల వెలిబుచ్చిరి. మొదటివిద్యార్థులలో నిర్భయమును పెంపొందింప వలయుననునది రెండవది వారియందు అన్యోన్యసహకారపద్ధతిని అభివృద్ధిజేయవలయుననునది ఇందుస్కౌటుఉద్యమము చాలఅవశ్యకమని ఉపదేశించిరి కాని పదునైదునిమిషములు జెప్పినతరువాత తమ ఉపన్యాసముయొక్క మొదటిభాగముజప్పితినని, అంతయుజెప్పుటకు కాలపరిమితిచాలదనియుజెప్పి ముగించిరి, ఇంతటితో అప్పటిసభ ముగిసెను.

నవ్వాబు మస్జా యార్ జంగు బహద్దరు గారు

తరువాత సభ పాయింత్రము ౨ గంటలకు సమావేశమయ్యెను. అప్పుడు నవ్వాబు మస్జా యార్ జంగు బహద్దరు గారు "మధ్యపానని రోధము" విషయముమీద ఉపన్యసించిరి. వీరు మన రాష్ట్రమున లక్షోపలక్షల రూపాయలు ఖర్చు అగుచున్నదనియు దానివలన చెప్పనలవిగానంత నష్టమువాటిల్లుచున్నదనియు చెప్పిరి. ఉపాధ్యాయులైనవారు తమవిద్యార్థులకు మద్యపానము యొక్క నష్టములగూర్చిబోధించి వారిని ఆచెడు అలవాటును అసహ్యించునట్లు చేయవలయుననియు చెప్పిరి. ఇంతటితో ఆసభ ముగిసెను.

### రెండవరోజు

మరుసటిదినమున (శనివారము) సరిగ ౨ గంటలకు సమావేశమయ్యెను. అప్పుడు మిస్ బుస్టర్ గారువచ్చి తమకమిటీపక్షమున జరుపబడి ప్రదర్శనముయొక్క కార్యనివేదికను జదివిరి. తరువాత కాజీమహమ్మదుహుస్సేన్ గారి పతీమణి ప్రదర్శనములో గెలుపొందినవారికి బహుమానముల పంచిపెట్టెను, తరువాత పోటీపందెముల బహుమానములనుగూడ పంచిరి. ప్రదర్శనమునందు ఎక్కువబహుమానములు మర్ మాన్క్లువారికి బోయెను, పోటీపందెములలో మాల్వీఅలీఅక్బర్ గారికి టెన్నిసుయందు మొదటిబహుమానము దొరకెను.

తరువాత సిటీకాలేజిలో లెక్చరార్ అగు సయ్యదుమహామద్ గారు "ఉర్దుభాషాపఠనముయొక్క ప్రాముఖ్యతనుగూర్చి ఉపన్యసించిరి. వీరిఉపన్యాసమంతయు ఉర్దూభాషనుగూర్చి భట్రాజుగారుపొగడినట్లుండెను. తరువాత దొరస్వామిగారు "ఇంగ్లీషుభాషను ఎట్లుబోధింపవలయును" అను విషయముమీద ఉపన్యసించిరి. వీరితరువాత డాక్టర్ హైదర్ అలీ ఖాన్ గారు "ఉపాధ్యాయులు విద్యార్థులకు తరచుగా వచ్చువ్యాధుల నెట్లుకనుగొనవలయును" అను విషయముమీద మాట్లాడిరి. వెంటనే సయ్యదుమహమ్మదు మెహదీగారు జపాన్ విషయముపై ఉపన్యసించిరి.

తరువాత మనరాష్ట్రపు విద్యాశాఖామంత్రిణాం నవ్వాబు మెహిదియార్ జంగు బహద్దరుగారు "విద్య" మీద ఉపన్యసించిరి. అంత శ్రీమతి సరోజనీనాయుడుగారు వచ్చి ఉపన్యసించిరి.

అంత అధ్యక్షులవారు తమ ఉపసంహారోపన్యాసమొసంగిరి. వీరుతమను అధ్యక్షులుగాజేసినందులకు కృతజ్ఞతావందనము అర్పించిరి. పైగా సభఅంత జయప్రదముగ జరిగించినందులకు అందరిని ఎక్కువగాకొనియాడిరి. ఈముందలి ఎక్కువజయముగునట్లు ప్రార్థించుచు తమ ఉపన్యాసమును ముగించిరి. అంత ఉపాధ్యాయమండలియొక్క అధ్యక్షులగు మౌల్వీసయ్యదుఅలీఅక్బర్ గారు మండలిపక్షమున అందరికి కృతజ్ఞతావందనములర్పించిరి, ఇంతటితో సభసమాప్తమాయెను తరువాతఅతిథులందరిని ఫలహారవిందునకు తీసుకవెళ్లిరి అదిగూడసాయంత్రము ౬ గంటలకు పూర్తియయ్యెను.

—

# ఐదవ ఆంధ్రమహాసభ,

## షాద్ నగరం. (రైల్వేస్టేషన్)

౧౭,౧౮,౧౯ బహమన్, ౧౩౪౬ ఫ. (మార్గశిరసు॥ ౭-౮-౯) తేదులలో జరుగును.

అ ధ్య క్షు డు:

**శ్రీయుతులు కొండా వేంకటరంగారెడ్డిగారు హైకోర్టువకీలు**

ఈ తేదులలో ఐదవ మహిళాసభకూడా జరుగును.

ఆహ్వాన సంఘకార్యాలయము } వేంకట నారాయణరెడ్డి-అధ్యక్షులు,
షాద్ నగరం } బూర్గుల వెంకటేశ్వరరావు-కార్యదర్శి.



# ప్రభుత్వమువారి దృష్టి ప్రారంభ విద్యపై మరలుచున్నది!

బాబెహుకూమతులో క్రొత్త విద్యా విధాన ప్రణాళిక అమోదింపబడినది

ఉన్నతవిద్యకు నిరుత్సాహము, సాంకేతికవిద్యకు ప్రోత్సాహము

హైద్రాబాదు ఉపాధ్యాయ మహాసభలో విద్యాశాఖమంత్రిగారి ఉపన్యాసము

నాకు ఈ తరుణమునిచ్చినందులకు నేను మీ కెంతయో కృతజ్ఞుడను. ఈ ఉపాధ్యాయమండలి సాధించుచుండిన అభివృద్ధినిజూచి నాకెంతయు సంతసముగలుగుచున్నది. ఇట్టి అభివృద్ధిని జూచి మిమ్ములనెంతయు అభినందించుచున్నాను.

ఇక రాబోవు సంవత్సరమునుండి ప్రభుత్వమువారు తమదృష్టిని ఎక్కువగా ప్రాథమికవిద్యవైపు ప్రసరింపదలంచియున్నారు. వారు విద్యార్థులకు ఉన్నతవిద్యయందు యిష్టముగలిగింపదలచుటలేదు. కాని సాంకేతికవిద్యను ప్రోత్సహింపదలచియున్నారు. ఇప్పుడు బాబేహుకూమత్ వారు ఒకస్కీముమ ఒప్పుకొనియున్నారు. అదిరాబోవుసంవత్సరము నుండిఅమలులోనికి రానున్నది. దానినిత్వరలోనే మేము ప్రచురింపదలచియున్నాము. దానినిచదివి ఇక్కడి ...హితనాయకులు తమఅమూల్యాభిప్రాయములొసగుచు ఆస్కీమును అమలులోపెట్టుటకు మాకు చేయూతనొసంగెదరని నమ్ముచున్నాము.

...ప్రభుత్వమువారిదృష్టి ప్రాథమికవిద్యమీద ...నుటలో వారు ప్రాథమిక విద్యను ... చేయుదురనిగాదు. ప్రస్తుతఆర్థిక... పరిస్థితులయందు, నిర్బంధ ప్రారంభ ...శిక్షను అమలునందుంచుట కష్టము. ... నిష్టముగలవారికి ఇప్పుడుసహాయములను గల్పించినచాలును. ... అలంకరించిన పురుషసింహములు ...ముఖములజూచుకొనినచో నేను ...ం చెప్పదలచుకొనియున్నాను ...సనందలి యమ్. ఏ. మొదలు ...గను బాలురకంటెబాలికలే ...గ్గిజయముబడసియున్నారు ...సహృదయపూర్వకము ...వారుపురుషులకన్న ఎ...ను, ఇదిచాలసంతో...షించదగినది. ఇంత గౌరవించి...నందులకు నేను కృతజ్ఞుడను.''

## దక్కన్ ఆయుర్వేదకళాశాల ప్రారంభము

స్వస్తిశ్రీ ధాతనామసం॥ ఆశ్వీయుజశుద్ధ దశమిఆదివారమునకు సరియగు ౨౫-౧౦-౩౬ [౨౦-౧-౪౬ ఫ.] తేదీనాడు ౭ గంటలకు హైదరాబాదు ఆయుర్వేద వైద్యసంఘమువారిచే స్థాపింపబడు "దక్కన్ ఆయుర్వేదకళాశాల" ను "మూర్తి మెడికల్ హాల్, నాంపల్లి" యందు సుప్రసిద్ధ న్యాయవాదులును గోలకొండ పత్రికాధిపతులును అగు శ్రీయుత సురవరం ప్రతాపరెడ్డి. బి.ఏ.బి.ఎల్. గారు తెరచెదరు కనుక ఎల్లరును విచ్చేయప్రార్థితులు.

డా. ఆచార్య (కార్యదర్శి)

నోటు:—పై కళాశాలలో చేరగోరువారు కార్యదర్శి, ద.ఆ. కాలేజి. ౨౨౫ సుల్తాన్ బజారు, హైదరాబాదు అను విలాసమునకు స్వయముగా వచ్చిగాని, ఉత్తరము ద్వారాగాని వివరములు తెలుసుకొనుడు.

## ఆంధ్రయువజనసంఘము హైద్రాబాదు

పైసంఘమువారు, శ్రీలశ్రీ నేపల్లి జానకిరామరావు జాగీర్దారుదేశముఖు వకీలుగారి యాజమాన్యమున, శనివారముసాయంత్రము ౬ గంటలకు "శ్రీకృష్ణ రాయభారము" అనునాటకము రెడ్డివిద్యాలయహాలులో ప్రదర్శింతురు.

కొన్నికారణములవల్ల సంఘపు వార్షికోత్సవము ప్రస్తుతము ఆపబడినది.

ఇట్లు
సం. కార్యదర్శులు.



## ము. ఘ. వ. నైజాం స్టేటు రైల్వే

# నోటీసు

హైద్రాబాద్ బి.జి. నుండి భోనగిరివరకు రైలు

1నవంబరు 1936 శనివారము మొదలు హైద్రాబాదు బి.జి నుండి భోనగిరివరకు యీక్రిందికాలములో ప్యాసింజరుబండి తిరుగును.

| 102 పటిల్ | | | 101 పటిల్ | | |
|---|---|---|---|---|---|
| హైద్రాబాదు బి. జి. | పోక | 16-55 | భోనగిరి | పోక | 8-34 |
| శికింద్రాబాదు | రాక | 17-10 | శికింద్రాబాదు | రాక | 9-44 |
| | పోక | 17-15 | | పోక | 9-49 |
| భోనగిరి | రాక | 18-28 | హైద్రాబాదు | రాక | 10-03 |

శికింద్రాబాదు }
అక్టోబరు 17, 1936 }

ఎ. వాట్సన్
ఆఫీషి. చీఫ్ ట్రాన్స్పోర్టేషన్ సూపరింటెండెంటు

## వ్యాయామప్రదర్శనము

రెడ్డియువజన సంఘముయొక్క పక్షమున పోయిన శుక్రవారమునాడు సాయంకాల మైదుగంటలకు రెడ్డివిద్యాలయమందు వ్యాయామ ప్రదర్శనమొకటి జరిగెను. రాజాపన్నాలాల్ బన్సీలాల్ బహద్దర్ గారు అధ్యక్షత వహించిరి. రాజాబహద్దర్ వెంకటరామారెడ్డి, సోమకొండరాజాగారు, ఆత్మకూరురాజాగారు వచ్చినవారలలో ప్రముఖులు. హనుమాన్ వ్యాయామశాలకుజెందిన రామచందర్ గారు చేసినప్రదర్శనములలో మోటరుకొదనాపుట, చెంబ్రుకతో బరువునులాగుట మరియు ఎత్తుట, రెండు ప్రక్కల నలుగురునలుగురుచేరి మెడకుత్రాడువేసి లాగుచుండసహించుట, ఇనుపకడ్డీలతో మెడమకొట్టించుకొనుటచాలఆశ్చర్యకరముగనుండెను.

మాస్టర్ లోకోరావు అనుబాలుడు ౩౦ యోగాసనములను ప్రదర్శించెను. అంజయ్య కత్తిసామును ప్రేక్షకుల చాలఆకర్షించెను.

అధ్యక్షులుగారు ఉపసంహారోపన్యాసములో ప్రొఫెసరు రామమూర్తిగారివలె ఇంకను ఎక్కువమంది యువకులు వ్యాయామముల పక్షసించవలెననిరి. రామచందర్ అనువానిని మెచ్చుకొని. హనుమాన్ వ్యాయామశాలకు రూ ౫౦ల విరాళమిచ్చెదమనిరి.

ఏ.బి. నరసారెడ్డిగారు అధ్యక్షునికి కృతజ్ఞతావందనమర్పించి రామచందర్ గారిని మెచ్చుకొనిరి.

అఖరున హనుమాన్ వ్యాయామశాలనుండి ఒకజట్టు ఈసంవత్సరము మైసూరు దశరాపండుగలో పాల్గొనుటకు పంపుటకై ద్రవ్యసహాయము కోరబడగా రాజా పన్నాలాల్ గారు రూ ౫౦లను, రాజాబహదర్ వెంకటరామారెడ్డిగారు రూ ౧౦లను, హకీం రామకృష్ణగారు రూ ౨౫లను, సోమేశ్వరగిర్జిగారు రూ ౧౫లను, సేట్ కైలాసరాజ్ గారు రూ ౧౫లను, లక్ష్మినారాయణ్ గారు రూ ౧౦లను, చింతడు గోపాల్ రెడ్డిగారు రూ ౧౦లను, సేట్ కిష్టిగారు రూ ౧౫లను, లాల్ మిండ్ రాజాగారు రూ ౫లను దానముచేసిరి.

సుమారు ౩ గంటలకు అంతయుముగిసెను.

AGAINST

Diabetes mellitus

LOBULINA

The World's most efficient Anti-Diabetic Specific. The Product of Swiss Serum & Vaccine Institute, Berne, Switzerland. If your Chemists do not have stock of "LOBULINA" send your order direct to the Sole Representative,

DR. JEAN F. STRANDGARD, DIABETES EXPERT, BANGALORE.

స్విట్జర్లండు దేశములో ప్రపంచములోకెల్ల ప్రసిద్ధిచెందినస్విస్ సిరంఅండువాక్సిన్ యిన్స్టిట్యూట్, బెర్ను వారివల్ల తయారుచేయబడిన "లోబులీనా" అను అతిమూత్ర నివారిణి.

అతిమూత్రములో మెలిటస్ అనువ్యాధికి యిది సాటిలేనిదని ప్రముఖులైన అతిమూత్రవ్యాధి చికిత్సకులచే అభినందించబడి వాడబడుచున్నది. ఇప్పుడు నేను ఇండియా మొత్తములో అతిమూత్రవ్యాధులకున్ను, రక్తవృద్ధికిన్ని చికిత్సలు చేయుచున్నాను. దీనికి నేను "లోబులీనా"కే ఋణపడియున్నాను.

ఉత్తర ప్రత్యుత్తరములు ఇంగ్లీషులో

డాక్టరు జీన్ యఫ్. స్ట్రాండుగార్డు

అతిమూత్రవ్యాధికి స్పెషలిస్టు.

బెంగుళూరు

## "ఉచితము"

1. కుటుంబసంరక్షణి వెల రూ 1-0-0
త్రిదోషహరములగు మూడు దివ్యౌషధ (రాజములు ప్రతియింట వుండతగినవి)
2. మహాభృంగామలక తైలం 1-0-0
నేత్ర. శిరోవ్యాధులకు
3. మాగీఫలరసాయనము 1-0-0
సర్వమైత్య వికారములు హరించును
4. రత్నపురుషలేహ్యము 1-0-0
"బాబ్ ఖాయా ఫేటాముస్త్ర"
5. శివామృతము 1-0-0
ఇదిశుక్లనష్టము నరములదుర్బలత్వమును బోగొట్టును.

## "జాతకము"

పుట్టినతేది గంటలు లేక గడియలు పంపినయెడల ద్వాదశభావములతో సహా జాతకము వ్రాసిపంపబడును. ౫ సం॥ ఫలములతో జాతకము రూ ౫ లకు వ్రాయించుకొన్న వారికి పై ౫ మందులలో నొకటి యుచితము. పైనుదహరింపబడిన ౫ మందు లొకేసారి కొను వారికి ఒక్క సంవత్సరము జాతకము మాసములవారిగా నుచితముగా వ్రాసిపంపబడును.

అడ్రసు—

6464, పండితాశ్రమము

సికింద్రాబాదు.

కూరలు సిద్ధముజేయునందులకు

## "సాగ్ సుందర్"

నుపయోగింపుడు

అన్నిమసాలాలు దీనిక్రింద రద్దు. ధర ౧ పౌండు 0-10-0. అర్ధపౌండు 0-5-4 పావు పౌండు 0-2-8 మరియు గరమసాల, జొన్నమసాల, ఊరగాయమసాల. మురబ్బాలు, ఊరగాయలు మరియు శ్రేష్ఠమైన తేయాకు. మ్ముటలవడుగుడు. జిల్లాలలోకొనువారికి వి. పి. ఖర్చులు భరింపబలయును.

బి. సి. జగ్ మోహన్

సాగ్ సుందర్ మరియువాల్క

నైజింగ్ వర్క్సు

షాహెరాహ్ ఉస్మాని శాఖాఫీసు

## సహారా ఎక్స్ట్రా




శుభ్రమైన నున్ననిక్షౌరములకొరకు సహారా ఎక్స్ట్రా బ్లేడును వాడుడు.

౫ బ్లేడ్లు గల పాకెట్ వెల 4 అణాలు

పోస్టుబాక్సు నెం. 154. బొంబాయి.

ఇంకొకచట్టము:

## ఇండో-బామ్ Indo Balm




రుమేటిసం. తల, వెన్ను. పండ్లనొప్పులకు, జలుబుదగ్గులకు పనికివచ్చును. యెప్పుడు దగ్గిరఉంచుడు. దానియొక్క విచిత్రమైన శక్తివ్యాధులను మూలధ్వంసము చేయును. ఒక్కొక్క డబ్బి రు0-8-0 పోస్టేజిలేకుండ ౩డబ్బీలురు 8-0 ఏజన్సీ పద్ధతులకు వ్యాపార పద్ధతులకు అన్నిచోట్ల దొరుకును

కర్ణిక్ బ్రదర్సు గిరాం. బొంబాయి ౪

ఏజంట్లు: జె. ఘాసు అండు కో, సికింద్రాబాద్.

పండిత డి. గోపాలాచార్యులవారి

## జీవామృతము



బలహీనతవలన జనించు రుగ్మతలను అటంకపరచి దేహమునకు అరోగ్యము రక్తశుద్ధి, నరములకుపటుత్వము కండపుష్టిని, మనోబలమును, తేజస్సును, జ్ఞాపకశక్తిని వృద్ధిపరచుటకు ప్రసిద్ధిచెందిన వాజీకరరసాయనము

రెండుసైజులలో అన్నిచోట్ల దొరకును

## వెస్టెండు టాకీస్

21 గురువారము మొదలు 23 శుక్రవారము వరకు

యూనివర్సల్ కంపెనీవారి వనచిత్రసీరియల్ ౨ భాగము

## Vanishing Shadow

విలియండెసాండ్, వాల్టర్, మిల్లర్ పాల్గొనిరి.

రాబోవుచిత్రము: కొల్హాపూర్ సినిటోన్ వారి Woman's Challange'

## కృష్ణా టాకీస్ గుల్జారుహౌసు

26 అక్టోబరు 1936 గురువారము మొదలు

హరిశ్చంద్ర ఆర్టుప్రొడక్షన్ వారి

## భారత్ - కా - లాల్

నటకులు

చంద్రరావు, కదం, మిస్. ఫిరోజ్ అండ్ లాటెస్

## సెంట్రల్ టాకీస్

నేడు ప్రదర్శింపబడుచున్నది.

పారమౌంటు చిత్రము

## బన్ సిరి బాల

గోహర్ [కర్నాటకి] అమరగానము

శంకర్-భావప్రకటనకు పెట్టింది పేరు,

రాబోవుచిత్రము-ప్రభాతకంపెనీవారి

జగత్ప్రసిద్ధ చిత్రము

అమర జ్యోతి

అద్వితీయ శిల్పము.

దుర్గాకోటే శాంత ఆప్టే పాల్గొనిరి.

## రాయల్ టాకీస్

నేటి రాత్రి

ఈస్టరన్ ఆర్ట్సు చిత్రము

## షేర్-క-పంజ

సర్దార్ అక్తర్

మిస్టర్ నజీర్

మిస్ ఆశాలత

యాస్మిన్

ష్యదాసిని పాల్గొనిరి.

## రీగల్ టాకీసు

౨౨ గురువారము మొదలు

దసరాకు ప్రత్యేకము

## చంద్రసేన

నలినీ తార్కాడ్ హావభావవిన్యాసముల

యిది వరప్రదాయి

ఏవమాత్ర్యసౌభాగ్యమును నే
నెట్లారక్షించుకొనగలను?
ఏమనవలెను?
ఆంధ్రభాషాభిమానులారా
చెప్పుడిగా???

# గోలకొండపత్రిక

GOLKONDA PATRIKA

HYDERABAD-DECCAN

The First Telugu Bi-Weekly in Andhra Desa and the only Telugu Newspaper for H E H. The Nizam's Dominions.

చందాదారులకు
నిజామురాష్ట్రమందలి ఎని
జిల్లాలలోని ఆంధ్రులు
లో, నిజామురాష్ట్రమందలి
వాఙ్మయమునకు గోలకొండ
పత్రికలో ప్రకటన

Vol. 11. | Thursday 22—10—1936 | No. 48


క్షత్రియకన్యలను బ్రాహ్మణులు వివాహమాడుట వేదములలో గనపట్టుచున్నది.

శతపథబ్రాహ్మణములో సుకన్యను చ్యవనుడు వివాహమాడినట్లున్నది. (శ. బ్రా. ౪-౧-౫) సుకన్యతండ్రి శర్యాతుడనికూడ కలదు. శర్యాతుడు క్షత్రియుడనుటకు నీక్రిందివాక్యము ప్రమాణము.

శర్యాతఉహ వాఇదం మానవో గ్రామేణ చచార.
(శ. బ్రా ౪-౧-౫-౨)

ఇచట శర్యాతునకు మానవః అను విశేషణము వాడబడినది. మానవుడనగా మనువంశములోనివాడని యర్థము. మనువు, ఇక్ష్వాకు మున్నగువారు సూర్యవంశక్షత్రియులు.

ఇచట శర్యాతికి మానవః అనువిశేషణము వాడబడినట్లే చ్యవనునకు ముందు ఖండికలో "ఆంగిరసః" అను విశేషణము వాడబడినది. ఆంగిరసులు పురోహితులు. అంతియేకాక చ్యవనుడు "ఋషి" యని "వమస్సేస్యే" అను సైదవ ఖండికలోనిమాటలనుబట్టి తెలియుచుకొవున వాతడు బ్రాహ్మణుడని స్పష్టమగుచున్నది.

ఇట్టివివాహములు రెండుమూడు ఋగ్వేదములో పేర్కొనబడినట్లు సాయణభాష్యమునుబట్టి తెలియుచున్నది. వేదములో మాత్రము వధూవరుల కులములు చెప్పబడెను. సాయణాచార్యులవారు భాష్యములో తెల్పియున్నారు. ఆవివాహములలో నొకటి పంచమ మండలములోని ౬౧ వ సూక్తములోను మఱొకటి దశమమండలములోని ౩౯ వ సూక్తములోనుగలవు.

బ్రాహ్మణకన్య క్షత్రియునికి వివాహమాడవలెనుకూడ ఋగ్వేదములో నొకచోటనున్నది. అసంగుడనురాజు అంగిరసునికుమార్తెయగు శశ్వతిక భర్తయని ఋగ్వేదము [౮-౧-౩౪]లో నున్నది. అసంగుడు క్షత్రియుడని యాతనికి వాడబడిన "పరమజ్యాః" [౮-౧-౩౦] అను విశేషణమునుబట్టి తెలియుచున్నది. ఈశబ్దమునకు "బలిమిగల" గలవాడని యర్థము. "సదతోస్యే" అను విశేషణముకూడ నీ ఋక్కులోనే యాతనికివాడబడినది. శత్రువుల యశ్వములీతనిచే జయింపబడినవని దీనికర్థము.

వర్ణమునకును వివాహమునకునుగల సంబంధమునుగూర్చి ప్రత్యక్షవిధి నిషేధవాక్యములుగలవు. మను, గౌతమ, యాజ్ఞవల్క్యాదులు సమానవర్ణులగు వధూవరులకు వివాహమును విధించుచున్నారు.

ఉద్వహేద్ద్విజో భార్యాం సవర్ణాం
[మను. ౩-౪]

[ద్విజుడు తనవర్ణమునకు చెందినభార్యను చేసికొనవలెను.]

గృహస్థస్సదృశీం భార్యాం విందేత
(గౌ. ధ. ౪-౧)

సమానమైనవర్ణముగల భార్యాభర్తలకు మాత్రమే కర్మతో సంబంధముగలదని ఆపస్తంబుడు చెప్పుచున్నాడు.

సవర్ణా పూర్వశాస్త్రవిహితాయాం యథర్తుగచ్ఛతస్తేషాం కర్మభిస్సంబంధః
[ఆ. ధ. సూ. ౨-౧౩-౧]

సవర్ణులగుదంపతులకుజనించినవారే సజాతులగుచున్నారు.

సవర్ణేభ్యస్సవర్ణాసు జాయంతే హి సజాతయః
[యాజ్ఞ. ౧-౯౦]

# శ్రుతిస్మృతులలోని స్త్రీలపరిస్థితి

వ్యాసకర్త:—

జటావల్లభుల పురుషోత్తముగారు ఎం.ఏ.

## వధూవరార్హతలు

అసవర్ణవివాహములవలన జనించినవారు అవాంతరవర్ణులగుచున్నారు.

అసవర్ణవివాహములు రెండువిధములు [౧] అనులోమవివాహములు, [౨] ప్రతిలోమ వివాహములు.

అనులోమా అనంతరైకాంతరద్వ్యంతరాసు జాతాః సవర్ణాంబష్ఠోగ్రనిషాద దౌష్యంత పారశవాః
[గౌ. ధ. ౪-౧౪]

[బ్రాహ్మణునకు క్షత్రియస్త్రీవలనగలిగినవాడు సవర్ణుడు, వైశ్యస్త్రీయందు గలిగినవాడు అంబష్ఠుడు, శూద్రస్త్రీయందు గలిగినవాడు నిషాదుడు. క్షత్రియునకు వైశ్యస్త్రీయందుగలిగినవాడు నిషాదుడు. శూద్రస్త్రీయందు గలిగినవాడు దౌష్యంతుడు, వైశ్యునకు శూద్రస్త్రీయందు గలిగినవాడు పారశవుడు. ఈసంతానములు అనులోమసంతానములు.]

ప్రతిలోమాస్తు సూతమాగధాయోగవక్షత్తృవైదేహకచండాలాః [గౌ. ధ. సూ. ౪-౧౫]

[శూద్రునకు బ్రాహ్మణస్త్రీవలనగలిగినవాడు చండాలుడు, క్షత్రియస్త్రీవలన గలిగినవాడు వైదేహకుడు, వైశ్యస్త్రీవలన గలిగినవాడు క్షత్తృ. వైశ్యునకు బ్రాహ్మణస్త్రీవలనగలిగినవాడు యోగవుడు, క్షత్రియస్త్రీవలనగలిగినవాడు మాగధుడు. క్షత్రియునకు బ్రాహ్మణస్త్రీవలన గలిగినవాడు సూతుడు. ఈసంతానములు ప్రతిలోమసంతానములు.]

ప్రతిలోమసంతానములు ధర్మహీనములు

ప్రతిలోమాస్తు ధర్మహీనాః
[గౌ. ధ. సూ. ౪-౨౪]

అందునను చండాలుడు పాపిష్ఠుడు.

అంత్యః పాపిష్ఠః
(గౌ. ధ. ౪-౨౭)

అనులోమవివాహము కామికపక్షములో నొకవిధముగ నంగీకరింపబడినది. ఎట్లన:

కామతస్తు ప్రవృత్తానామిమాస్స్యుః క్రమశోవరాః శూద్రైవ భార్యా శూద్రస్య సా చ స్వా చ విశస్స్మృతే తే చ స్వా చైవ రాజ్ఞశ్చ తాశ్చ స్వా చాగ్రజన్మనః

(మను. ౩-౧౨,౧౩)

కామమార్గమున ప్రవర్తించువారికి క్రమముగా నీక్రింద చెప్పబడిన భార్యలుండవచ్చును. శూద్రునకు శూద్రయే భార్య. వైశ్యునకామెయు వైశ్యయు, క్షత్రియునకు నాయిద్దరు క్షత్రియయు, బ్రాహ్మణునకామువ్వురు బ్రాహ్మణియు నుండవచ్చును.]

ఈ కామికవివాహములలోను బ్రాహ్మణక్షత్రియులు శూద్రస్త్రీని వివాహమాడుట యొక్కడు కామికవిషయముగాని దానిని వెనువెంటనే నిషేధించుచున్నాడు.

న బ్రాహ్మణక్షత్రియయోరాపద్యపి హి తిష్ఠతోః కస్మింశ్చిదపి వృత్తాంతే శూద్రా భార్యోపదిశ్యతే

[మను. ౩-౧౪]

[ఆపత్తులోనున్నపుడుగూడ బ్రాహ్మణక్షత్రియులకు శూద్రభార్య యొప్పుటను జెప్పబడిలేదు.]

ఇక నావివరుసలవిషయముతో శ్రుతిస్మృతులయభిప్రాయము నించుకపరీక్షింతము. వేదములలోనీవిషయమై విశేషప్రస్తావనలేదు. సోదరునివివాహమాడుట మాత్రము స్పష్టముగ గర్హింపబడినది.

అఘాతాగచ్ఛనుత్తరాయుగాని యత్రజామయః కృణవన్నజామి.

[ఋ. సం. ౧౦-౧౦-౧౦]

[స్త్రీలు సోదరునిదక్క మఱొకని వివాహమాడునో కొంతకాలము గడుపుదురు. —అనగా సోదరుని వివాహమాడువారు మృత్యువాతబడుదురు.]

సమానార్షగోత్రములుగలవారికి వివాహము లకూడదని స్మృతులు చెప్పుచున్నవి.

విందేత విధివద్భార్యా మసమానార్షగోత్రజాం
(లిఖిత ౪-౧)

మాతృపంక్తిమున నైదుతరములవరకును పితృపక్షమున నేడుతరములవరకును సంబంధము కలియని వారలకే వివాహముజరుగవలెనని నాలాస్మృతులు చెప్పుచున్నవి.

పంచమాత్సప్తమాదూర్ధ్వం మాతృతః పితృతస్తథా.
[యాజ్ఞ ౧-౫౩]

దీనినిబట్టే మేనత్తకూతును మేనమామకూతును వివాహమాడరాదని తెలుచున్నది. మనుస్మృతిలో స్పష్టముగ నిట్లున్నది,

పైతృష్వస్రేయాం భగినీం స్వస్రీయాం మాతురేవ చ మాతుశ్చ భ్రాతురాప్తస్య గత్వా చాంద్రాయణం చరేత్ ... బుద్ధిమాన్ జాతత్వేనానుపేయాస్తాః పతతిహ్యుపయన్నధః.

[మను ౧౧-౧౭౨]

[మేనత్తకూతును, మేనమామకూతును మేనకోడలిని బుద్ధిమంతుడు వివాహమాడరాదు. ఏలన వారుజ్ఞాతులే. వారిని వివాహమాడువాడు పతితుడగును]

కాని ఋగ్వేదఖిలసంహితలో మేనత్త మేనమామబిడ్డలవివాహమును సమ్మతించునట్లగపట్టువాక్యము కలదు.

ఆయాహీంద్ర పథిభిరీడితేభిర్యజ్ఞమిమం నో భాగధేయం జుషస్వ తృప్తాం జహుర్మాతులస్యేవ యోషా భాగస్తే పైతృష్వసేయీ వపామివ.

[ఓయింద్రుడా, కొనియాడబడినమార్గములచేతరమ్ము. ఈయజ్ఞసంబంధమైన భాగము సేవింపుము. ఋత్విక్కులు తృప్తికరమైనహవిస్సునిచ్చుచున్నారు. అవప యెట్లున్నదనగా మేనమామకూతురువలెను, మేనత్తకూతురువలెయు తనప్రియమైనదిగానున్నది.]

సమానవర్ణమై, ప్రవరసంబంధములేనిదియైనను గూడ నీక్రిందిలక్షణములుగల కులమందు జనించినకన్యను వివాహమాడరాదని మనుస్మృతి చెప్పుచున్నది.

మహాన్త్యపి సమృద్ధాని గోజావిధనధాన్యతః స్త్రీసంబంధే దశైతాని కులాని పరివర్జయేత్ హీనక్రియం నిష్పురుషం నిశ్ఛందో రోమశార్శసం క్షయ్యామయావ్యపస్మారి శ్విత్రికుష్ఠికులాని చ. [మను ౩-౬

[గోవులు, మేకలు, ధనము, ధాన్యము సమృద్ధములై గొప్పవైయున్నను నీక్రింది పదికులములు స్త్రీసంబంధములో విడిచిపెట్టవలెను. ౧. జాతకర్మాదిసంస్కారముగలది, పురుషసంతతిలేనిది, వేదములు చదువుకొనని ౪. పెద్దరోమములు గలది. ౫. మూలవ్యాధిగలది, ౬. క్షయవ్యాధిగలది, ౭. అజీర్ణముగలది ౮. అపస్మారవ్యాధిగలది, ౯. బొల్లికలది, ౧౦. కుష్ఠుగలది.

ఈదుర్గుణములులేక ఇతరసద్గుణములున్నను నీకులము నుండి కన్య మంచిదైనచో తెచ్చుకొనవచ్చును.

స్త్రీరత్నం దుష్కులాదపి

[మను ౨-౨౩౮]

తండ్రి మహాపాతకుడైనను నాతనికూతును వివాహమాడవచ్చునుగాని వివాహమునకు పూర్వమొకదినమున నామెనుపవాసము చేయింపవలెననియు యాజ్ఞవల్క్యస్మృతి చెప్పుచున్నది.

కన్యాం సముద్వహేదేషాం సోపవాసామకించనాం.
[యాజ్ఞ ౩-౨౬౧]

పతితుని పురుషసంతానమే పతితమగునుగాని స్త్రీసంతానము పతితునికాదని వశిష్ఠస్మృతి చెప్పుచున్నది.

పతితేనోత్పన్నః పతితో భవతి అన్యత్ర స్త్రియాః
[వసిష్ఠ ౧౩-౫౧]

పతితులు పతితులతోనే వివాహములు చేసికొనవలెనని ఆపస్తంబుడు చెప్పుచున్నాడు.

అభిశస్తాః — — — మిథో వివాహమాస్సాః
(ఆప ౧-౨౯-౮)

పూర్వము వివాహముకానిదానిని, తనకంటె చిన్నదానిని యందమైనదానిని వివాహమాడవలెనని యుంచుమించుగ నన్నిస్మృతులును చెప్పుచున్నవి.

అనన్యపూర్వికాం కాంతామసపిండాం యవీయసీం
[యాజ్ఞ ౧-౫౨]

వధూనిర్ణయములో మరికొన్ని నియమములుగూడ మనుస్మృతి పేర్కొనుచున్నది.

నోద్వహేత్కపిలాం కన్యాం నాధికాంగీం న రోగిణీం నాలోమికాం నాతిలోమాం న వాచాటాం న పింగళాం నర్క్షవృక్షనదీనామ్నీం నాంత్యపర్వతనామికాం న పక్షిహిప్రేష్యనామ్నీం న చ భీషణనామికాం అవ్యంగాంగీం సౌమ్యనామ్నీం హంసవారణగామినీం తనులోమకేశదశనాం మృద్వంగీముద్వహేత్స్త్రియం.

[మను ౩-౮,౧౦]

[ ౧౧ వ పేజీ చూడుడు ]

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad. Editor K. Balakrishna Reddy.